Sl.no. 387




ఓం

శ్రీగురుపరబ్రహ్మణేనమః.

Acc no 5829

శ్రీమత్కానుపర్తి - అబ్బయామాత్య కవివర

ప్రణీతపురూరవశ్చరిత్రాంతర్గత.

# నారదపురూరవసంవాదము.

ఇయ్యదిముముక్షాపేక్షిత,

భక్తహృద్రంజనంబుగనుండునటుల.

అల్లక - వీరభద్రయ్యగారిచే.

చెన్నపట్టణము చాకలపేటపోస్టు.

నెం. ౨౮ కొల్లావారి అగ్రహారమునందుండు

పద్మ - త్యాగరాయశెట్టిగారి

శ్రీరాజరాజేశ్వరీనికేతన ముద్రాక్షరశాలయందు

ముద్రింపించి ప్రచురింపఁబడియె.

౧౯౦౨ వ సం॥ వెల అణా ౧.



ఓం
శ్రీగురవేనమః.



# నారదపురూరవసంవాదము.



గురుస్తవం.

శ్లో॥ గురుర్బ్రహ్మా గురుర్విష్ణుః । గురుదేవో మహేశ్వరః ।
గురుసాక్షాత్పరబ్రహ్మ । తస్మైశ్రీ గురవేనమః॥

కథాప్రారంభము.

చంద్రవంశ తిలకుండగు పురూరవ మహీపాలుండు, చతురబ్ధి పరీత భూమండలంబెల్లఁ దనభుజాపరాక్రమంబున నేక చక్రంబుగఁ బరిపాలించుచు నొకనాడు, మంత్రి పురోహిత సామంత విద్వజ్జన పరివారసేవిత జేగీయమానుండై పేరోలగంబుండు నాసమయంబున.

సీ॥ లాంఛనంబుసముజ్జ్వలభుజాంతరస్థిత మహతిరూపంబున రహింవహింప । నమృతంబువిష్ణునామాక్షరమధుర గాంధర్వరూపంబునఁ దరఁగలెత్తఁ । జంద్రికల్బళధళాచ్ఛశ్వేతశారీర కాంతిరూపంబునఁ గ్రమ్మికొనఁగ । జల్లఁదనంబుశశ్వత్కృపా రసపూర్ణ దృష్టి రూపంబునఁ దేటపడఁగ । మనుమఁడైనపురూరవఖ్యాతకేంద్రుఁ । జూడనేతెంచు చంద్రుని జాడదోఁప । నరుగుదెంచెనభోమార్గయానమునను । నారదుఁడుమహాత్త్రిజితశరన్నాదుండు. తే॥ స్వాంతములు పల్లవించెను సత్కుదంబ । ములకుఁబంకజాతమ్ముల పొంకమెడలె । భువనము సుఖోదయ స్ఫూర్తిఁ బొలుపు మిగిలె । నారదాగమమునకదిసైజమకచ. వ॥ ఇవ్విధంబున.

ఉ॥ వచ్చినఁజూచిలేచి పరివారములో నెదురేగియవ్విభుం। డచ్చప్రభక్తిఁ బ్రమ్రొక్కికనకాసనసుస్థితుఁజేసిపూజలన్ । మెచ్చాదవింపఁగా నినయమే

రుకమంజులవాక్యవై భవం । బెచ్చు ననేక భంగులమునీంద్రుఁడుదీవనలిచ్చి యుండియుక్. క॥ కుశలంబెమీకుహితులకుఁ । గుశలమెకుశలంబె బంధు కోటికినెల్లం । గుశలమెభృత్యశ్రేణికిఁ । గుశలంబెధరిత్రి ప్రజలకున్మను జేంద్రా. వ॥అనిపలికిన నాసంయమీంద్ర చంద్రునితోఁ జంద్రవంశతిలకుం డు వినయసంభ్రమమాధురీధురీణ వచనంబులనిట్లనియె. క॥ మీకా రుణ్యామువలనను । మాకిందఱకున్శుభంబు మౌనీశ్వరమీ । రాకవలనమ ద్భాగ్యము । లోకస్తుతమయ్యెజగతిలోపలనింకక్. తే॥ వినుత మోగుణ మూర్తవై వెలయుఁ వు । మిత్రరూపంబుతోవచ్చి మేలొసంగ । నిపుడుగద యుష్మత్కులమున కెలమియగుట । చక్రవర్తిత్వమింకఁగదాస్పష్టమగుట. క॥ అనిపలుకుచున్న కేంద్రుని । వినయోక్తులకలరిమౌని విభుఁడుతదీయా। నన మునఁగారుణ్యరసం । బెనయఁగటాక్షములు నిగుడ నిట్లనిపలికెక్. సీ॥ ఉత్తమా న్వయమున నుదయంబు నొందుట సరిలేని సౌందర్యశాలి యగుట । యఱువదినాల్గువిద్యలఁ బ్రవీణుఁడౌట పటుబాహు శౌర్య సంపన్నుఁడగుట । ధరణి చక్రాచలాంతంబుగా నేలుట నిగ్రహానుగ్ర హానిపుణుఁడగుట । వేదశాస్త్రోక్త సద్విధులాచరించుట యౌదార్య గు ణముచే నధికుఁడగుట । హరిహర బ్రాహ్మణార్చనా నిరతుఁడగుట । యాత్మవిదుఁడౌట యొక్కరియందెగలవె । పుణ్యనిధివైననీయందెపో వసఁగెనన్ని । సద్గుణములు పురూరవస్సార్వభౌమ. క॥ స్తుత్యుండమదుల కైనను । నిత్యోత్సుకుఁడైన ధారుణీపతిరాజా । ప్రత్యక్షదైవతమ్మన । సత్యవ్రత పూర్వవచనసంగతివినవే. వ॥ అనిపలికివెండియు నమ్మహాను భావుండమ్మానవపతితో రాజకీయప్రసంగంబున నిట్లనియె. చ॥ మతియు తుబుద్ధిశాలిఁబరవర్గవిభేదన దక్షుసత్క్రియా । చతురునిశాంతునిక్సమ రసాహసుఁ గార్యవిచారకౌశలుం । బతిహితశీలుసద్గుణ విభాసురుభృ త్యజనప్రజామనో । హితనిజవర్తనుష్వసుమతీశుఁడు మంత్రిగఁజేయఁగాఁ దగుక్. క॥ తానెంతయధికుఁడైనం । గానీమనుజేశ్వరుండుకార్యాకా ర్య । జ్ఞానమునిపుప్రధానుల। తోనాలోచించియుక్తితోనేలుఁగఁదగుక్.

క॥ సప్తాంగరక్షణంబును । సప్తోపాయము లొనర్చు సామర్థ్యంబున్ ।
సప్తవ్యసనవిరక్తియు । సప్తద్వీపేంద్రరాజ సద్ధర్మంబుల్. సీ॥ న్యా
యంబుదప్పని నడవడితోడను బెంపుగాఁ బ్రజలఁ బాలింపవలయు । నుచి
తవ్యయంబు సేయుచు నర్థ సంపదల్కొదవ గాకుండఁగఁ గూర్పవలయు ।
శౌర్యోజ్జ్వలములైన చతురంగబలముల నెంతయు విరివిగా నేలవలయు।
సమయంబు బలము విచారించి పైకొని పరరాజ్యమాక్రమింపంగవలయు।
నేమఱుటలేక గడిదుర్గసీమలందు । నాప్తులును గార్యఖడ్గప్రయత్న పరు
లు । నయినవారలఁ దగిన సైన్యములతోడ । నునుపవలయును దన పేర్మి
మొఱలుపొగడ. క॥ తనరాజ్యమొరులరాజ్యం । బనవలవదు బుద్ధికుశ
లులగు చారులఁ బం । చి నిఖిలవార్తలు నిచ్చలు । వినుటొప్పును భూవిభుం
డు విశ్రుతమతియై. క॥ బలవంతులతోఁ బగయును । బలవద్బాంధవుల
తోడి పగయును ధరలోఁ । బలువురతోఁ బగయును మఱి । బలభేదికినైన
నఁ దెచ్చు భంగములఁ దలఁపన్. క॥ చెలిమియయుచితం బెంతయు । బలవం
తునితోడ నతఁడు పగవాఁడయినం । జలియింపక తంతకం బెను । బలవంతు
ని చెలిమి వడసి పగయీఁగఁదగున్. చ॥ నిజభుజశక్తినైనఁ దన నేర్పునఁ దం
త్రిమొనర్చియైన న । క్కజముగ వారిపైఁ జలము గల్గిన వారలఁ గూల్చియైన
వై । రిజనవినాశనంబు నొనరింపక జాడ్యము చేతనున్న భూ । భుజుని ప్ర
భుత్వమెల్ల నదిపొంత మహీజము గాదె భూవరా. క॥ విశ్వాసపరుల నె
ఱిఁగిన । రీశ్వరుఁ డధికారమిచ్చు టెంతయు నుచితం । బైశ్వర్యయుతులు
గాఁగన । విశ్వాసులఁ జేయఁదగదు విమలవిచారా. తే॥ కరుణ తనకెంతొ
గలిగినఁ గనకవస్తు । వాహనాదులు చాలనీవలయుఁ గాని । భూతలేశ్వరుఁ
డెంతయాప్తులకునైన । నాజ్ఞ ద్రోవంగనిచ్చుట యనుచితంబు. చ॥ కలి
మి కొలంది రీవి గమకంబు కొలందిఁ బ్రవర్తనంబు చో । గ్బలము కొలందిఁ
బూనికయనురక్తి కొలంది సమాదరంబు మే । లాలయు కొలంది యత్న
ముని యోగి కొలందిని భారమీఁగియుం। దెలివి కొలంది మాటయును తింపఁ
గ యోగ్యతఁ దెచ్చు నేతకున్. శా॥ సర్వజ్ఞత్వముఁ గల్గి కీర్తిలతికాజాలం

బు చక్రాద్రిపైఁ । బర్వన్నిశ్చలధర్మమార్గమున సప్తద్వీప సామ్రాజ్య
ము । న్స్థైర్యస్థితి నేలుచుండఁ దలఁపన్నితి ప్రకారంబులో । యుర్వీనాథని
సర్గసిద్ధములుగానోపున్విచారించినన్. వ॥ అనిమఱియుంబ్రసంగోచితం
బులగు విశేషభాషణంబుల నభినందించు మునిపుంగవుంగనుంగొని వినయ
నమ్రవదన కమలుండగుచు మహీవల్లభుండిట్లనియె. ఉ॥ ఎందఱురాజులీ
యవని నేలినవారిఁక నేలనున్న వా । రెందఱు లెక్కసేయఁదరమే పరమేష్టి
కినైన నట్లనే । నందఱిలోననొక్కరుఁడనై ధరయేలుటయెంతప్రాభవం।
బిందులకింత పెద్దగ మునీశ్వర నన్గొనియాడ నేటికిన్. ఉ॥ దేహమువాయు
సంచలిత దీపికపుత్రకళత్రమిత్రసం । దోహముస్వప్నకాలమునఁ దోఁచె
డిసందడిరాజ్యభోగస । న్నాహముజంత్రపుంబ్రతిమనాట్యము సంపద
యైంద్రజాలమీ । మైహికసౌఖ్యమేమి సుఖమంచుఁ దలంచెదనయ్య నా
రదా. సీ॥ కామరోగాదిదుష్కర శత్రువర్గప్రతాపప్రధానసాధనము
ధనము । జన్మపరంపరాసంపాదితానేక ఘనకర్మజాలవర్ధనము ధన
ము । కైవల్యసంప్రాప్తి కారణవైరాగ్య ధర్మమార్గావరోధనము ధ
నము । సకలావగుణపుంజ సంశ్రయాశారూపదారుణ నిగళ బంధనము
ధనము । గలిగిగర్వంబుదొట్టి దుఃఖంబుమదికిఁ । జెనుచునజ్ఞానపావకేం
ధనముధనము । స్వప్నలబ్ధపదార్థంబుచందమునను । దలఁచిచూడంగ వ
ట్టిదంధనముధనము. ఉ॥ చక్కెరపూఁతపూసిన విషంబులు భామలవా
క్యవైఖరుల్ । చక్కఁగ వెన్నమెత్తినశిలల్వివిరిబోఁడుల చిత్తముల్మఱు ।
ల్చెక్కినసంకెలల్సతులచేష్టలు కొమ్మలనమ్మవచ్చునే । యక్కట మేఁకవ
న్నెపులులంగనలెన్నిట నెన్నిచూచినన్. క॥ చన్నులుమాంసపుముద్దలు।
గన్నులుదుర్జలముఁబుసులు గాతెడితోఁజటల్ । వెన్నులు నెముకలపాత
ర । లన్నులనిటు తెలిసివలచుట వివేకమెకా. తే॥ మూత్రపతనస్థలంబు
పవిత్రమనుచుఁ । ద్రొక్కరానేలఁ గనికోసితొలఁగుచుందు । రట్టిమూ
త్రపుఁగాలువనైనదోలి । యోసిదానికిరోయదీ యుల్లమహహ. చ ॥
కొడుకులుగల్గుదాఁక నొకకొన్ని దినంబులుచింతనందనుల్। వాడమినన్నా

యయు వున్నులము బుద్ధియు విద్యయుఁ జాలఁగల్గ గా । నుడుగని చింత గల్గితను నోలిభజింపని చింతతండ్రి కె । వ్వఁడుఁ గడుచింత సేయుదురు పుత్రులు శత్రులుగాక మిత్రులే. వ॥ మునీంద్రా పుత్ర దార ధనాది సంగరహితులై విషయసుఖంబులం బరిత్యజించి యరణ్య గిరి గుహాంతర ప్రముఖ వివిక్త ప్రదేశంబులం గందమూలఫలంబు లాహారంబులు సేయుచు మోక్షసామ్రాజ్యపట్టాభిషిక్తులగు మహానుభావుల జీవనంబు పావనంబని తోఁచుచున్న యది రాగద్వేషమూలంబైనయీతుచ్ఛ సామ్రాజ్యంబెంత పూజ్యంబు సార్వభౌమత్వాభిమానంబున నవిద్యామగ్నులమైన మావంటివారలకు సంసారపారావారంబు తరించు నుపాయం బెట్లు గలుగు నానతిమ్మని మోక్షాపేక్షం బ్రార్థించినం బార్థివోత్తము వాక్యంబులాకర్ణించి హర్షోత్కర్ష మానసుండై నీ ప్రశ్నంబింతయొప్పునే యిట్టివైరాగ్యంబు బహుజన్మ సుకృత సంచిత తపఃప్రభావంబువలనంగాక సంభవించునే యని వికసిత వదనారవిందుండై యత్తపోధన సత్తముండు నృపోత్తమున కిట్లనియెం. తే॥ అడిగితివి వేదశాస్త్ర సారాంశమైన । యట్టి పరమరహస్యంబు నవనినాథ । యడుగుచుందురు గాని ధర్మకామార్థపణితు । లడుగ రెవ్వరు నీభంగి నాత్మవిద్య. శా॥ అజ్ఞానంబున దోఁచు సంసరణ దుఃఖావాప్తి యజ్ఞానమా । త్మజ్ఞానంబున నాశనంబగుఁ దదాత్మజ్ఞానమయ్యీశ్వరా । నుజ్ఞం గాని ఘటింప దీశ్వరుఁడు సంతోషించు వేదోత్తమా । స్వాజ్ఞన్వర్తిలు ధర్మమున్నరుఁడు కర్తై సేయు సద్వృత్తికిన్. ఉ॥ కావునఁ గర్మనిష్ఠఁ గత కల్మషుఁడైన ముముక్షుఁ డయ్యువి । ద్యావరణంబువాసి సముదంచిత బోధమునొందు బోధలీ । లావిభవంబు చేత సకలంబును బ్రహ్మముగా నెఱుంగఁ గద । ద్భావము నిశ్చలంబైన బ్రహ్మము దానగు నిర్విశేషతన్. వ॥ నరేంద్రా యద్వితీయంబును, నపరిచ్ఛిన్నంబును, నాద్యంతరహితంబును, సచ్చిదానందస్వరూపంబును నై, శుద్ధచైతన్యంబైన బ్రహ్మంబాకృతియ వెలుంగుచుండు; నట్టి బ్రహ్మంబునందు నసత్యస్తన్మౌ,యనాదిన్మౌ, మిథ్యాభూతమై, తచ్ఛక్తిన్మౌ, త్రిగుణాత్మకన్మౌ,నిర్వచనీయ

త్మై, కలుగఁ దోఁచు మూలప్రకృతియ వస్తువయ్యును దదాశ్రయత్వ త
ద్విషయత్వ బలంబునం జేసి వస్తువుం బోలి ప్రకాశించుచు నాత్మసత్తాస్ఫూ
ర్తులవలన స్ఫురద్రూపంబై యావరణవిక్షేపరూపంబులు దాల్చియుండు
నట్టి ప్రకృతి సాత్త్వికగుణ ప్రకాశంబువలన మాయయనంబడు; నమ్మా
యయందుఁ బ్రతిఫలితంబగు చైతన్యంబును మాయాధిష్ఠానచైతన్యంబును
నమ్మాయయుం గూడి కారణోపాధికుండైన యీశ్వరుండై సర్వజ్ఞత్వ
సర్వేక్షకత్వ సర్వనియంతృత్వ సర్వేశ్వరత్వాది ధర్మంబులు గలిగియుం
డు; నయ్యీశ్వరుండు తమోగుణ ప్రకాశినియగు మాయనీక్షించినఁ ద
త్సంకల్పవశంబున శుక్తియందు రజతాధ్యారోపంబును, రజ్జువునందు స
ర్పాధ్యారోపంబును, స్థాణువునందుఁ బురుషాధ్యారోపంబును దోఁచు
కైవడి భ్రాంతికల్పితంబులై మహదహంకారంబులును, శబ్దస్పర్శ రూప
రసగంధ సమేతంబులై త్రిగుణాత్మకంబులై గగనపవనాగ్ని జలభూత
త్వంబులును గ్రమంబున సంభవించె; నవి సూక్ష్మ భూతంబు లనం
బడు; నా భూతంబులు పంచీకృతంబులయి యన్యోన్య భాగ మేళ
నంబున స్థూల భూతంబు లయ్యె; నా స్థూల భూతంబుల వలన స్థూ
ల శరీరంబును, సూక్ష్మ భూతలంబు వలన సూక్ష్మ శరీరంబును, మా
య వలనఁ గారణ శరీరంబు నయ్యె; నిట్లు సమష్ట్యు పాధులయిన
యేతత్త్రియంబున నీశ్వరుండు క్రమంబున విరాట్టును, హిరణ్యగర్భుం
డును, నవ్యాకృతుండును నను సంజ్ఞల నొప్పుచు, నవాంతరసృష్టిస్థితి ప్ర
ళయ నిమిత్తంబున రజస్సత్త్వతమోగుణావలంబున బ్రహ్మవిష్ణురుద్రరూ
పంబులఁ గ్రీడించుచుండునిది సమష్ట్యుపాధికుండైన యీశ్వరుని ప్రకారం
బు; ఇంక వ్యష్ట్యుపాధికుండైన జీవుని ప్రకారంబు వినుము, ప్రకృతి రజ
స్సత్త్వతమోగుణ ప్రకారంబువలన నవిద్యయనంబడు నయ్యవిద్యారూపం
బైన యంతఃకరణంబునందుఁ బ్రతిఫలితంబైన చైతన్యంబును నంతఃకరణా
దిష్ఠాన చైతన్యంబును నయ్యంతఃకరణంబునుం గూడి జీవుండను సంజ్ఞఁ
గలిగి యవిద్యావశతం గార్యోపాధికుండై స్వరూపవిస్మృతినొంది కేం

చిత్ జ్ఞుండైయుండునట్టి జీవునికిస్థూల భూతజన్యంబై స్థూలశరీరంబును సూక్ష్మభూతజన్యంబై జ్ఞానేంద్రియ కర్మేంద్రియ పంచప్రాణమనోబుద్ధి రూపంబైన సూక్ష్మదేహంబును నవిద్యారూపంబైన కారణ దేహంబు నుంగలిగియుండునందు విశ్వతైజసప్రాజ్ఞలను సంజ్ఞలజాగ్రత్స్వప్నసు షుప్త్యవస్థలయందు స్థూలప్రవిక్తానందభోగంబు లనుభవించుచుజీవుండ హంకారయుక్తుండై కర్తృత్వభోక్తృత్వాదిధర్మంబులు తనయందునా రోపించుకొను నయ్యావివేకంబువలన నభిమానంబును నభిమానంబువలన రాగద్వేషాదులును రాగద్వేషాదులవలనఁ గర్మంబులును గర్మంబువలన దేహంబును దేహంబువలనసుఖదుఃఖంబులును బ్రాప్తంబులగుచుండునందు నొకానొకపురుషుండు పురాకృతసుకృతవిశేషంబున బహుజన్మంబులలో నొక్కంట సంసారనివర్తనంబునకు నుద్యోగియగునట్టి వాఁడుసత్సంగతి వలన సన్మార్గవర్తియై పాపంబులంబాసి జ్ఞాననిష్ఠుండగు జ్ఞాననిష్ఠవలనఁ జిన్మాత్రవ్యతిరిక్తంబైన వస్తువెద్దియుంగలుగదనియును గలిగిన యట్లతోఁ చుచున్న సకలజగంబును నెండమావులుజలంబులై తోఁచిన కైవడిమనో విభ్రాంతి కల్పితంబులనియుం దెలిసి కార్యకారణోపాధులు మిథ్యయగు టంజేసి యీశ్వరత్వ జీవత్వంబులసత్యంబని ఘటపటోపాధ్యభావంబునం ద దంతర్గతాకాశంబును మహాకాశంబును నేకంబయినయట్లను స్వ్యాతం బైన యాత్మయొక్కటియను నిశ్చయంబున బ్రహ్మైక్యానుభవంబునం ద న్మయుండైయుండు నతండు జీవన్ముక్తుండై ప్రారబ్ధక్షయానంతరంబున విదేహకైవల్యప్రాప్తుండగునని యెండియునిట్లనియె. శా॥ నామంబుల్మతి రూపముల్క్రియలునానాభంగులందోఁచుని । ద్రామోహంబునస్వప్న ముస్వలెనవిద్యంజేసి సత్యంబుగా । దేర్మిజ్ఞానికి దోఁచినట్లయిన బ్రహ్మీ భూతమైయుండునో । భూమీశోత్తమ చిన్మయంబు సకలంబున్వేఱు లే దింతయుక్. క॥ చిత్తనియెను సాగరమునఁ । జిత్తంబనువాయువశత సృష్టితరంగో । త్పత్తియగుచిత్తమడఁగిన । న త్తతిజగ మడఁగుముక్తి యుననదియౌడా. క॥ పలాపలుచదువులుబ్ర । హ్మలోకనసుఖము తనకు

ననుభవమగునా । కీలెఱుఁగుట మేలెఱుఁగుట । భూలోకసురేంద్ర సూ
క్ష్మబుద్ధిం గనుమా. క॥ ఆరూఢుఁడు ముక్తినగా । గ్రారూఢుండారురు
క్షుఁడారోహణకా । ర్యారంభపరుఁడు గావున । నారెంటికిఁ గలదె
భేదమధికారములన్. తే॥ కామికర్తయుఁగాక సత్కర్మములని । వా
ర్పణంబులు సేయుచునారురుక్షుఁ । డరయ నారూఢుఁడగును గాలాంతర
మున । నతని కెద్దియుఁ గర్తవ్యమపుడు లేదు. ఉ॥ మాటలు వేయునేల నొక
మర్మము సెప్పెద మోక్షదాతలై । పాటిలు విష్ణుశంకరుల భక్తి దృఢంబుగఁ
గల్గెనేనినా । నాఁటికి వానికన్ని సుగుణమ్ములుఁ దామె ఘటింప ముక్తుఁడౌ ।
బూటకపున్విచారములఁ బోవఁగనేమి ఫలంబు భూవరా. క॥ సగుణంబె
ఱిఁగి భజించిన । నగు నిర్గుణసిద్ధిసిద్ధుఁడగు నాతనికిన్ । జగమెల్లను బ్రహ్మ
మయం । బుగదోఁచును సర్వకాలమును నొక్కగతిన్. సీ॥ బయలసంరం
భిలోపల నసంరంభియై కార్యతంత్రంబులు గడపెనేని । సఫలప్రయత్నంబు
విఫలప్రయత్నంబుఁ దనకుఁ దుల్యంబుగాఁ దలఁచెనేని । ననివార్యమై కర్మ ము
నవచ్చు సుఖము వర్జించిన యట్లు భోగించెనేని। సౌఖ్యంబు దుఃఖంబు సంప్రా
ప్తమైన బోనుబ్బు సుక్కులు లేక యుండెనేని । జీవపరమేశ్వరైక్యసచ్చిత్సు
ఖాను । భూతి నిస్సంశయాత్ముఁడై పొలిచెనేని । నతఁడు ప్రారబ్ధమున వ్య
వహారియైన । ముక్తిసామ్రాజ్యపట్టాభిషిక్తుఁడగును. చ॥ వనమున నున్న
నేమి గృహవాసము చేసిన నేమి యాత్మభా । వనయున సంగవృత్తియరివర్గ
జయంబును గల్గియుండినన్ । వనమున నున్న నేమి గృహవాసము చేసిన నేమి
యాత్మభా । వనయున సంగవృత్తియరివర్గ జయంబును లేక యుండినన్.
క॥ దేహము తాఁ గానని నిజ । మూహింపఁగ నేర్చి సట్టి యుత్తమునకుఁ ద
ద్దేహము వర్తనభాంధవ । దేహంబులు మిథ్యలనుచుఁ దెలియంబడవే. సీ॥
పుత్రమిత్రకళత్రమై త్రిపత్రిల్లు వసిష్ఠసంయమి బ్రహ్మనిష్ఠ వినమె । కమఠతుఁ
డై రాజధర్మము మూని చరించు జనకుని విజ్ఞానచర్య వినమె । వాణిజ్యవృత్తి జీ
వనుఁడై నయిల తులాధారు నిపుణబోధంబు వినమె । కటికిగాయకము
చేఁగాలంబుఁ గడపు ధర్మవ్యాధు విజ్ఞానమహిమ వినమె। వారి ప్రారబ్ధము

ననుండవలసి జ్ఞాని। కెట్టివ్యవహారములనున్న నేమికొదవ। జ్ఞానవైరాగ్య
నిశ్చలానందపూర్ణుల । లయ్యు నారుజీవన్ముక్తులగుట నిజము. క॥ ఏయాశ్ర
మమున నుండిన । నాయాచారములు నడప కాశ్రమసుఖిత్వ। ప్లాయత్తమతి
నిపుంచకుం । డైయేని ప్రవృత్తి నసుట నర్థము గాదే. ఉ॥ పంచపాది॥
కర్మము బంధ మంబని సుకర్మము మాని సుఖంబు గోరిదు । ష్కర్మము
సేయుచున్ బుధులు కాదనినన్విని కాత్మకున్న వే। కర్మలంచుఁ దాఁ జెడుట గా
కొకకొంత జిజ్ఞాననిష్ఠకుం । గర్మ ఫలాపికిం జెఱుచుఁ గాఁ బురుష ండుపదే
ష్టనంచుని । ప్రవృత్తికినాస్థ లేదు భయ కర్మములున్ విధిచే ఘటించినన్. శా॥
జ్ఞానారూఢుఁడు బాహ్యచేష్టలమవ స్సంకల్పుఁడై చేయునే। నైసంబ్రాక్ర
తునట్లవానిఁ గనితా నాచేష్ట లేచేయఁ గాఁ। బోనల్పజ్ఞుఁడు పంచనన్మ విదలం
పుల్మావకా రూఢుఁడ। న్నెనంచున్ ఫలమేమి చేష్టలమదిన్నిశ్చింత లేకుండినన్.
ఆ। మనసు చల్లఁబడఁ మాట లెన్నాడిన । ముక్తిగాదు వాదశక్తిగాని। మన
సె కారణంబు మఱి బంధమునకు మో । క్షమునకను చూఁ దెలుపుఁ జదువు విన
మె. క॥ జ్ఞానాజ్ఞానక్షేయమను। లేతెలుంగున వేలుదోపకేకఁబు గన। ద్వైతా
త్మత వెలుఁగు ప్రపంచాతీతుం డవ్వాఁడు శంక డెయారూఢుఁడలన్. క॥ ఇదినగరి
మిదియరణ్యం। బిదిసౌఖ్యం బిదియసౌఖ్యమితఁడు పురుషుం। డిదిసతియనితోఁ
పద మె। య్యదిచూచిన బ్రహ్మమయమయారూఢునకున్. తే॥ సంగములు
సర్వమును గల్గి సంగికాఁడు। భోగములు సర్వమును జెందిభోక్త గాఁడు। కా
ర్యములు సర్వమును జేసినకర్త గాఁడు । విగతసంకల్పుఁడగు బ్రహ్మవేత్తయగు
ధిప. తే॥ ఇచ్ఛ లేనియోగికింద్రియంబులు కర్మ । వశత చేస్వభావవర్తనము
లు । మెలఁగుచున్న నేమియిలఁ బుణ్యపాపంబు। లంటవతఁడు కర్తయగుటఁ
జేసి. తే॥ నిర్విషయచిత్తుఁడగు బ్రహ్మనిష్ఠునకును। దనుసుఖంబులు ప్రారబ్ధ
మునఘటించు । నంతిమే కానియువివానినంటకుండుఁ। గమలపత్రాగ్రవ
నజలకనికవోలె. తే॥ శయ్య నుండియుఁ బెక్కుదేశములఁ బెంటఁ। దిరుగ
లగాంచుచున్న నిద్రించునిభంగి । సచ్చిదానందుఁడు వ్యాదాజనము
బాధలను బొందినట్లుంచు భ్రాంతి గాదె. క॥ కిలలోనఁ జకులాడినఁ । ల

వేగాయము బమేలు కాంచిన వెనుకం । దెలియక నును పటిసంస్మృతి। కలఁ
కలు విజ్ఞాని కేల కలుగం బోఁచున్. క॥ ఆయెఱుక దొరకు కొరకుఁగ । దా
యోగజ పాదిస్థ్యలా యెఱుక దృఢం । బైయున్నతఁ డేక్రియలం । జేయడు
లోకోపకృతికిఁ జేసినఁ జేయున్. మ॥ తొల్లి జన్మమునన్ వైననిప్పుడయినన్ దు
ష్కర్మ నిర్మూలనం । బిల బ్రహ్మార్పణసత్క్రియా మహిమచే నెంతే ధృతిం జేసి
ని ర్మలుడై యన్ శ్రవణంబు తన్మననముద్రా సన్నిధి ధ్యాసలున్ । సులభం
బౌ శ్రవణాదులబ్బక చలించుం దామసత్యాగతన్. క॥ ఈ మేననుసత్కర్మ
ము । లేమియు జేందక యె జెందు నిద్ధజ్ఞానం । బా మును పటిభవమునని ।
ష్టామసుకర్మాప్తి విగతకల్మషుఁడయినన్. ఉ॥ చేయఁడు సత్క్రియల్ బయలఁ
జేసిన యట్లసుఖించు లోపలన్ । జేయును గార్యముల్ బయల జేయని యట్లసు
ఖించు లోపలం। జేయఁడు కృత్యమంచు మతి జేసిన కృత్యమటంచు నెంచరా।
దేయశబ్రహ్మవిద్యతుడ కెక్కిన యట్టి మహానుభావునిన్. వ॥ అమితముగ్రై ఘ
టించు విషయానుభవంబుల భోగియయ్యును । త్తముడగు యోగి బ్రహ్మమ
యతన్ మదిరంజిలు చుండు గీతన్ను । త్యములను దాళమానవశుఁడయ్యు శిర
స్థిత పూర్ణకుంభమున్ । సమధికయుక్తిఁ నిల్పికొనఁజాలిన నాట్య ధురీ
ణుకై వడిన్. తే। తలఁచినఁదలంపకున్న నిత్యప్రబోధ। పూర్ణుఁడగు తా
ను దాఁ గాక పోవ్వటు । లెఱుఁగదగు గుణితనకం బెనెద్ది లేక । యెఱుక
మఱపులు సమమైన యెఱుక యెఱుక. వ॥ అనిపలికి వెండియునిట్లనియె.
ఉ। కోరకు మే పదార్థమును గోరి వచ్చునె రాని వస్తువుల్ । గోరకయు
న్నగా వెతనకున్ లభియింపఁగ సున్న యర్థముల్ । గోరిన రానిచోఁ గ
లిగి కోల్పడుచో వెత గాన సజ్జనుల్ । గోరరనాస్థ బ్రాప్తములు గొందరు
కుందరు వస్తుహానికిన్. శా॥ ప్రారబ్ధంబగు మేననే యనుభవం బొచుండఁ
ద త్ప్రాప్తవై । యాగూఢస్థితి సర్వమున్ మఱచి సర్వావస్థలం జిత్సుధా।
ధారాపానసుఖాప్తి సర్వగతశుద్ధ బ్రహ్మమే వంచు శం । కారాహిత్యము
మానుమీయదియ మోక్షప్రాప్తి భూపాల్ల భా. సీ॥ ఆసక్తి లేక యత్నా
యత్నాగతంబైన నిషిద్ధ సుఖముల ననుభవింపు । ప్రారబ్ధవశత నాప

త్సంపదలువచ్చు నగవుప్పొంగులనీకు । కర్మఫుగాక లౌక్యము
లు శాస్త్రీయంబులైనట్టి యుచితకార్యములు సేయు । మాత్మ నింక
తనద్వైతినై తేలి కృత్రిమాద్వైతతఁగ్రీడ సలుపు । పాడమున జ్ఞానమున
నదిపోవఁబోవు । నఖిలసంసారమును మిథ్యయని యెఱుంగు । సచ్చిదా
నందమిదియవస్థాత్రయమ్ముక । సాక్షినీనాటఁ దేయము మోక్షమిదియు.
తే॥ సకలమును జిన్మయముగ దృశ్యములు నదిక । దృశ్యములుగాఁదలంచి
నిస్పృహతఁగార్య । వర్తివై దైవగతినేల వలయురాష్ట్ర। మేలుమనహం
కృతిని శంక యేలనీకు. చ॥ అని మునిపుంగవుండు నిగమాంతరహస్య సమ
గ్రవాగ్రసా । యనముకృపామతిన్ మిహికరాన్వయుకర్ణ పుటంబులం
దునిం । చిన బహుజన్మ భాగ్యమునఁజేసి యవిద్యఁ దొలంగి సత్యమై ।
యనుభవమయ్యె నాత్మఁజిదహంబను సంస్మృతిసుస్థిరంబుగన్. వ॥ ఇట్లు
పరమజ్ఞాన సంపన్నుండయిన యమ్మహామునీంద్రు నుపదేశంబున నాస్పృ
పాలశేఖరుండఖండసంపత్పూర్ణుండై యానందంబున నతనికి సా
ష్టాంగవందనంబులు చేసి యనేకవిధంబులఁ బ్రస్తుతించె నారదుండును న
తనిమహావిశేషంబునకు సంతోషించుచు బహుభంగులనాశీర్వదించి వీ
డ్కొని స్వర్గ గమనోన్ముఖుండయ్యె నప్పురూరవుండును యథేచ్ఛాప్ర
వర్తనంబున సుఖస్థితుండయ్యె.

ఇది,

పురూరవశ్చరిత్రంబునందలి నారదపురూరవ సంవాద రూపంబగు

వేదాన్తప్రచారము సంపూర్ణము.






# ప్రకటన.




ఈముద్రాయంత్రంబునందు తెనుగు గ్రంథములు, నోటీసు వగైరా అచ్చుపనులు ప్రశస్తమైనసైపులతో చక్కగాసవరించి సులభమయినచార్జికి ముద్రించడమగును గానముద్రింపించుకొన నభిలషించువారు చెన్నపట్టణము చాకలపేటపోస్టు కొల్లావారిఅగ్రహారమునందుండు, శ్రీరాజరాజేశ్వరీ నికేతన ముద్రాక్షరశాలాధికారియగు పమ్మి - త్యాగరాయశెట్టి గారిపేరటికి దరఖాస్తులను పంపవలయును.



